# TREATMENT FOR CHOLERA.

## విషూచి వైద్యము.

CONTENTS.

## చెన్నపట్నము ఆర్యపుస్తకశాలయందు విక్రయమునకు సిద్ధముగానుండు పుస్తకముల జాబితా.

---

౧. వర్ణవైద్యశాస్త్రము:—ఇందు ఔషధము లేకయే జలముచేతను, ప్రకాశముచేతను సకలరోగములను నివర్తిచేసి కొనుటకుం దగిన విధులు వ్రాయంబడియున్నవి. ౦—౮—౦

౨. వైద్యసారరత్నావళి:—ఇందు సంస్కృతాంధ్ర కర్ణాటాంగ్లేయ ద్రావిడ మళయాళ పారసీక గ్రంథములలోని సకలసారాంశములను కనుగొనవచ్చును. వైద్యులకిది హస్తాభరణమనందగును. ౧—౦—౦

3. పాతంజలయోగ శాస్త్రము:—ఇది పతంజలి మహర్షి ప్రణీతము. దీనికి భోజదేవవృత్తి ననుసరించి తెనుగు తాత్పర్యమును, ఇతర మహాత్ములచే చెప్పంబడిన రహస్యములు వ్రాయంబడి యున్నది. పారమార్థికులగు ఆస్తిక శిఖామణుల కెల్లరకును పఠనపాఠనార్హము. ౧—౨—౦

౪. యోగవిద్య:—ఇదితారకరాజయోగాధి కారులకును, యోగము నభ్యసించువారికిని, నిశ్చలచిత్తులై యుండవలయునని కోరువారికినిఅత్యంతావశ్యకమైనది. ఇందుపద్మాసనాది ముఖ్యాసనములు ముప్పదిరెంటిని ప్రతిమారూపముగ గనఁబఱచబడియున్నది. ౦—౫—౦

౫. ఉత్తరగీత:—ఇదివఱకు ముద్రింపంబడియుండు ప్రతివలెగాక బంగాళీదేశప్రతిననుసరించి ౫౦ శ్లోకము లధికముగా గలిగి సుకరమైన తాత్పర్యముతో ముద్రింపంబడినది. ౦—౪—౦

౬. ధనంజయనిఘంటు:—అమరత్రికాండాది నిఘంటువుల కంటె పురాతనమైనదేగాక పండితులకును సంస్కృతభాషను నేర్చుకొను వారికిని

విద్యార్థులకును చాలాయుపయోగకారియైన టీకా తాత్పర్యముతో గూడి యున్నది. ౦—౬—౦

౭. నానాదేశసామెతలు:—జపాన్, చీనా, హిందుస్తాని. బంగాళ, మలయాళ, కర్ణాటకదేశ సామెతలకు తెలుగు భాషాంతరీకరణము.—౨—౦.

౮. కాశీయాత్రచరిత్ర:—ప్రస్తుతకాలమున కాశీదేశమునకు బోవు వారికి, అచ్చట చూడదగిన విశేషముల నంతయు కరతలామలక మగునట్లు వీథులపేరులతో గూడ వ్రాయంబడి యుండుటేగాక, యేయే చోటనుండి యేయేచోట్లకుపోయిన నేయేవింతలు చూడవచ్చునో అవియన్నియు విస్తారముగ దెలియచేయబడియున్నది. ౦—౪—౦

౯. చైతన్యాచార్యచరిత్ర:—బంగాళాదేశమునందు ప్రసిద్ధికెక్కిన చైతన్యమతమనెడు వైష్ణవమతమునకు కర్తయైన గౌరాంగు లనెడు వారి చరిత్ర. ౦—౪—౦

౧౦. కర్మోపన్యాసము:—ప్రపంచోత్పత్తి మొదలు ప్రళయము వఱకును మానవులు తెలిసికొనందగిన యంశముల నంతయును వేదపురాణేతిహాసములనుండి సంగ్రహింపంబడి యొక్కొక్క విషయును నొక్కొక్క యుపన్యాసముగా విభజనచేసి ప్రతియుపన్యాసమునకును తెనుగు తాత్పర్యము వ్రాయబడియున్నది. ౧—౦—౦

౧౧. వల్లభాచార్యుల చరిత్ర:—ఇందు, ఘూర్జర (గుజరాతి) దేశమునందు ప్రసిద్ధముగనుండు శుద్ధాద్వైతమత స్థాపనాచార్యులైన శ్రీవల్లభాచార్య గోస్వామివారియొక్క యవతారమును, వారిదిగ్విజయమును, విస్తరింపబడి యున్నది. ౦—౮—౦

౧౨. ఢిల్లీపాదుషాకథలు:—ఇందు బాలురకును బాలికలకును స్త్రీలకును రసికులకును వాక్పటుత్వమును కలుగజేయదగినట్టి చిత్ర చమత్కార హాస్యాద్భుత కథలు నలుబదియెనిమిది గలవు. ౦—౪—౦

౧౩. జగన్నాథ క్షేత్రమాహాత్మ్యము:—జగన్నాథ స్థలమునుగురించి యేయేపురాణములయం దెట్లెట్లు చెప్పబడినవో వానినన్నిటిని యిందుగనం దగును. ౦—౨—౦

౧౪. పాతివ్రత్యలక్షణము, సత్పురుషలక్షణము:—ఇందు పతివ్రతలగు స్త్రీలును, సజ్జనులును, నడుచుకొనదగిన విధులు గలవు, శ్లోకములును తాత్పర్యములును చేరినది. ౦—౧—౦

౧౫. జీవప్రబోధము:—ఇది మూడాశ్వాసములు గల పద్యకావ్యము, అద్వైత సిద్ధాంతమును బోధించును. ౦—౧—౦

౧౬. హిందూవివాహ శాస్త్రసంగ్రహము:—ఆర్యజనులువివాహము చేయవలసిన విధులు,ఇందు శ్లోకములును తాత్పర్యములునుగలవు. ౦—౧—౦

౧౭. శివాజి మహారాజాచరిత్రము.—శివాజి మహారాజు యొక్క జన్మము మొదలు ఆతనిఅవసానమువరకునువిస్తరించి వ్రాయబడియున్నది. ౦-౪-౦

౧౮. హిరణ్మయిచరిత్ర:—ఇది బంగాలీ భాషలోనుండి తెనిగించిన మనోహరమైనకథ. (Novel) ౦—౨—౦

౧౯. రాధారాణి:—ఇది వంగభాషలో నుండి తెనిగించిన చమత్కారమైనకథ. (Novel) ౦—౪—౦

౨౦. జ్యోతిషామృతసారము:—ఇందు సకలమైన జ్యోతిశ్శాస్త్రములయొక్క విషయములు చేర్పబడియున్నది. జ్యోతిష్కులకును, జ్యోతిషమును నేర్చుకొనువారికిని యత్యంతావశ్యకమైనది. ౧—౦—౦

౨౧. అష్టకవర్గచక్రములు:—దీనివలన నిమిషమున కొక అష్టకవర్గము చేయవచ్చును. ఎవరిజాతకముల నైనను సులభముగాచూచుకొనవచ్చును. ఇట్టి యంత్రములేక కొందఱు అష్టకవర్గము చేసి తప్పిపోవుచున్నారు. దీనిని కనుగొనుటకు గ్రంథమును గలదు. ఇవి రెండుచేరి. ౦—౧౨—౦

## ముద్రించుచుండు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ౧. కళాపూర్ణోదయము, వచనము. | ... | ... | ౦—౮—౦ |
| ౨. కాశీరామేశ్వర మజిలీకథలు | ... | ... | ౧—౦—౦ |
| 3. సకలార్థసాగరము. | ... | ... | ౨—౦—౦ |
| ౪. ఏకమూలికాప్రయోగవైద్యరత్నావళి. | | ... | ౦—౧3—౦ |
| ౫. పురాణసముచ్చయము, ఇందు పదునెనిమిది పురాణముల విషయములుగలవు. | ... | ... | ౦—౮—౦ |
| ౬. విష్ణుదశావతార చరిత్ర వచనము. | ... | ... | ౦—౬—౦ |
| ౭. విచారసాగరము | ... | ... | ౨—౦—౦ |
| ౮. రాయలప్పాజి కథలు ... | ... | ... | ౦—౪—౦ |
| ౯. టీకాత్రికాండశేషము. | ... | ... | ౦—౧౦—౦ |
| ౧౦. టీకాసాంబ నిఘంటువు. (ఆంధ్రనామ నిఘంటువనియు పేరు గలదు. ... ... | ... | ... | ౦—౫—౦ |
| ౧౧. హఠయోగ ప్రదీపిక. ... | ... | ... | ౧—౮—౦ |
| ౧౨. థియాసఫీ మాన్యూల్. (దివ్యజ్ఞానదీపిక) | | ... | ౦—౪—౦ |

# పీఠిక.

ఆంధ్రదేశంబునం దనేకవైద్యశాస్త్రగ్రంథములున్నయవిగాని, ద్రావిడాంగ్లేయుల యభిమతము ననుసరించినవియును శాస్త్రపరిచయమును దేశకాలానుభవమును అనేక జనానుకూల వైద్యమును దెలిసిన వైద్యుడు చెప్పిన "విషూచివైద్యశాస్త్ర" గ్రంథములాంధ్రభాషయందు లేవు. అట్టిగ్రంథము ద్రావిడంబునమాత్రము మ. జగన్నాథనాయడు గారురచియించియున్నారు. మరియొక్క గ్రంథము ద్రావిడ భాషయందు వ్యాధిలక్షణములను మాత్రము సంపూర్ణముగా దెలియజేయుచున్నది. ఇవితప్ప తక్కిన ద్రావిడ గ్రంథములన్నియు మన తెనుగు నందలి గ్రంథముల కంటెను తప్పులకుప్పలైనవి. ప్రకృతంబున దేశమందంతట అప్పుడప్పుడు జనులనుహింసించు విషూచిరోగము యొక్క లక్షణములను గూర్చి పూర్వులు రచియించిన గ్రంథములయందు విశేషాకారముగ గానంబడకున్నయది. అట్టిది యొకానొక సమయమునసుండి ప్రక్షిప్తమైనదేమోగాని ప్రకృతస్థితి కనుగుణముగా నీరోగలక్షణములనువిస్తరించు గ్రంథములు దొరకుట దుర్లభముగనున్నది. కావున నేనిప్పుడట్టికొఱంతను నివారింపవలయునని దలంచి అనుభవజ్ఞులొకరిద్దరు రచియించినవియు, ప్రస్తుతకాలమునకు ప్రయోజనకారియైనవియు నగు వానిని గైకొని దీనిని పూర్తి కావించితిని. ఇయ్యది యాంధ్రదేశీయులకు పఠనీయమైన ముఖ్యగ్రంథములలో నొక్కటియైయున్నదియని చెప్ప నొప్పియున్నది. ప్రజాక్షేమార్థమునకై కావించిన యిక్కార్యమునకు సంతసించు గుణగ్రహణ పారీణులు తమతమ యభిమతమును గ్రంథకర్తకుం దెల్పి గ్రంథకర్త వందనములకు పాత్రులగుదురుగాకయని ప్రార్థింపంబడుచున్నారు.

ఇట్లు,

ఓ. వై. శ్రీ. దొరసామయ్య.

# జ్ఞాపిక.

వ్యాధిగ్రస్తులకు సర్వదా యుపచారములు చేయుటకు సమీపమున మనుష్యులుండవలసినది యత్యావశ్యకము. అట్లుండువారు రోగినిజూచి అయ్యో, అప్పా, కన్నులు లోనికి పోయినది, కాళ్లు చేతులు చల్లనైనది, ముఖము వివర్ణమైనది, నాకు చూడగా సందేహముగ నున్నదియని చెప్ప గూడదు. వైద్యుడు చేయిచూచినమీద అబ్బే, యీరోగం కుదురుతుందా, నాకేంతోచదమ్మా, ఇట్లేయుండేగదా మొన్న సుంకడు పోయినాడు, అనిచెప్ప కూడదు. ఎంతసేపటికిని వ్యాధిగ్రస్తుని బంధుమిత్రాదులకు వైద్యుడైనవాడు కొండంత రోగమును గోరంతగా చెప్పుచు మందుమాత్రము ప్రాణోత్క్రమణమగువఱ కిచ్చుచుండవలయును. రోగిసమీపముననుండువారును వైద్యుడును చెప్పునట్టి ధైర్యవచనములు రోగికి ఔషధమునకంటె ననేకవేలపాళ్ళు గుణమునిచ్చునని యెఱుగవలయును. మరియు వైద్యుడు ఎంతటి ప్రసిద్ధి నొందినవాడైయెనను వానియొద్ద కొన్నిసమయములయందు వ్యాధికితగిన యౌషధములేకయుండవచ్చును. అట్టిసమయమున రోగియొక్క బంధుమిత్రాదులు ఆ వైద్యునివదలి మఱియొకవైద్యుని సహాయమును గోరినయెడల మేలు కలుగును. హిందువులలో తమయింటివైద్యు డేమన్నిచ్చిన నది సంజీవియని యును, వేఱొక్క వైద్యుడు సంజీవియిచ్చిన నది మట్టితోదుల్యమనియును దలంచెదరు. ఇందుచేతనే యనేకులు యమధర్మరాజు దర్శనమునకుంబోయె దరు. మరియు వైద్యులలోను గొందఱు తమయొద్దమందులేదని చెప్పక సర్వాంకష ప్రజ్ఞవహించి సకలవ్యాధులను నివర్తింపజేయు సకలౌషధములును గల వని నమ్మించి విత్తమును ప్రాణమునుగైకొనుచున్నారు. ఈ విషయములను రోగులును రోగియొక్కబంధుమిత్రాదులును వైద్యులును జ్ఞప్తియందుంచుకొని ఆరోగ్యభాగ్యంబులొందుట శ్రేయస్కరము. సర్వేజనాస్సుఖినోభవన్తు.

# వ్యాధి మూలము.

శ్రీమజ్జగదీశ్వరునిచే సృజింపంబడిన జీవరాసు లన్నిటికంటె మానవ శరీరముదాల్చిన జీవరాసులు పుణ్యవంతులై యున్నారు. మానవులకు ఇహపర సుఖంబులు రెండును అత్యంతావశ్యకములు. వీనినింబడయ గోరువారు ఆరోగ్యమును సంపాదింపవలయును. ఆరోగ్యములేనివాఁడు రోగియనఁబడును. రోగము కలిగినయెడల శరీర సౌఖ్యము తగ్గును. శరీర సౌఖ్యము లేనియెడల ఐహిక సుఖము లభింపదు. ఐహిక సుఖము లేకపోయినచో ఆముష్మిక సుఖము లభింపదు. శరీరము ఆరోగ్యస్థితి నొందకుండుటకు ప్రబలకారణము మనుష్య ప్రయత్నము లేమియే ముఖ్యకారణముగాని వేఱొండు కాదు. ఎట్లన ;—

సాధారణముగా జనులు ఆహార విహార నిద్రాదులను పాటింపక పోవుటయే ప్రధానకారణము. అపరిశుద్ధమైన స్థలములయందు పుట్టినట్టి పదార్థస్వీకరణమును, అశుద్ధస్థలవాసమును, అశుద్ధజల స్నానపానములును, అపక్వ ఫల అపక్వాన్న అమితాహారసేవనమును, అకాలభోజనమును, అమితభోగమును, అకాలనిద్రయును, అతిదూరసంచారము ననునివి వ్యాధులను కలుగజేయును. ఇట్టివానిని సాధ్యమైనంతవఱకు వారివారి శరీరతత్త్వము ననుసరించి తొలగించుకొనవలయును. కొన్ని సమయములయందు పైనజెప్పినవానివలన కలుగునట్టి వ్యాధులకు నామములు సహితము గ్రంథాదులయందు గానంబడవు. మరియు గాలి, వాన, మంచు, ఎండ మొదలగువానివలన గలుగు ఆరోగ్య మిట్టిదియనియు, అనారోగ్య మిట్టిదియనియు తెలిసికొనక సంచరించుటవలన సంభవించు వ్యాధులు కుదురుటయే కష్టముగా నున్నది. ఇంతేగాక కొందఱు కాలదేశస్థితులను, వయః పరిపాకమును గుఱుతెఱుగక వ్యాధులను సంపాదించుకొనుచున్నారు. ఇట్టివిషయములవలని లాభాలాభములను విశేషముగా నాచే రచియింపంబడిన "వైద్యసార రత్నావళి" యందు గనందగును.

TREATMENT FOR CHOLERA.

# విషూచి వైద్యము.

## ప్రథమ భాగము.

---

శ్లో. అజీర్ణ మామంవిష్టంభం విదగ్ధంచ యదీరితం
విషూచ్యలసకౌతస్మా ద్భవేచ్చాపి విలంబికా ౧.

తా. ఆమమును, విష్టంభమును, విదగ్ధమును, అనునీమూఁడునుఅజీర్ణము విషూచి, అలసకము, విలంబికము అను నీమూడు రోగములను కలుగఁజేయును. (విష్టంభము=స్తంభించుట; విదగ్ధము=కాక; విలంబికము = కాలతామసము.)

విషూచికానామ నిరూపణము.

శ్లో. సూచీభిరివగాత్రాణి తుదన్సంతిష్ఠతేఽనిలః
యత్రాజీర్ణేచసావద్యైర్విషూచీతినిగద్యతే ౨.

తా. అజీర్ణమునందు సూదితో పొడిచినట్లును, వాతాధిక్యముచేత శరీరమునందు వేదనయును కలుగుటచేత ఇది విషూచికారోగ మనబడెను.

శ్లో. నతాంపరిమితాహారం లభన్తేవిదితాగమాః
మూఢాస్తామజితాత్మానో లభన్తేఽశనలోలుపః ౩.

తా. ఎవఁడు ఆహారమునుమితముగా స్వీకరించునో వాఁడు విషూచికా రోగస్థుఁడుకాడు. ఇట్టి జ్ఞానములేని మూఢులు ఇంద్రియముల యిచ్ఛానువర్తులై అమితముగా భుజించి యీరోగమునకు లోనగుచున్నారు.

## విషూచికా లక్షణము.

శ్లో. మూర్ఛాతిసారో వమథుఃపిపాసా
శూలభ్రమోద్వేష్టన జృంభదాహాః
వైవర్ణ్యకంపౌ హృదయేరుజశ్చ
భవన్తితస్యాం శిరసశ్చభేదః ౪.

తా. మూర్ఛ, అతిసారము, వాంతి, దప్పి, కడుపునొప్పి, మైకము, కాళ్లుచేతులువిరుచుట, తలతిరుగుట, ఆవులింతలు, మంటలు, శరీర వర్ణము మాఱుట, భయము, ఱొమ్మునొప్పి, తలనొప్పి, అను నీగుణములుగల ది విషూచికా రోగమని తెలియదగినది.

## అలసకరోగ లక్షణము.

శ్లో. కుక్షిరానహ్యతేత్యర్థం ప్రదామ్యేత్పరికూజతి
నిరుద్ధోమారుతశ్చైవం కుక్షావుపరిధావతి ౫.
వాతవర్చోనిరోధశ్చ యస్యాత్యర్థంభవేదపి
తస్యాలసకమాచష్టే తృష్ణోద్గారౌతుయస్యచ ౬

తా. కడుపు కలియబెట్టుట, సహింపరాని కడుపుమ్రోత, వాయుబంధనము, వాయు ప్రకోపముకల్గి శిరఃపర్యంతము వ్యాపించుట, మలబంధము, అతిదాహము, అను నీలక్షణములు అలసకరోగమందు కలుగును.

## విలంబికా లక్షణము.

శ్లో. దుష్టంతుభుక్తంకఫమారుతాభ్యాం
ప్రవర్తతేనోర్ధ్వమధశ్చయస్య

విలంబికాన్తాం భృశదుశ్చికిత్సా
మాచక్షతే శాస్త్రవిదఃపురాణః 2.

తా. కఫము, వాయువు, అపక్వభోజనము చేత నోటితోడను ఆసనముతోడను ప్రవర్తియగుట, అను నీలక్షణములు విలంబికా రోగమందు గలుగును. దీనికి చికిత్స చేయుట అసాధ్యము.

అజీర్ణ విషూచికా లక్షణము.

శ్లో. యత్రస్థమామం విరుజేత్తమేవ
దేశంవిశేషేణ వికారజాతైః
దోషేణయేనావతతంశరీరం
తల్లక్షణైరామసముద్భవేశ్చ 3.

తా. ఆమస్థానమునందు దోషముగల్గి అది అనేక వికారములుగ దేశభేదముల ననుసరించి పరిణమించి మృతిని గలుగజేయును.

అలసకరోగయుక్త విషూచికా లక్షణము.

శ్లో. యఃశ్యావదన్తోష్ఠనఖోల్పసంజ్ఞో
వమ్యర్దితోభ్యన్తరయాతనేత్రః
క్షామస్వరః సర్వవిముక్తసన్ధి
ర్యాయాన్నరోసౌపునరాగమాయ 4.

తా. దంతములు పెదవులు గోళ్లు అను నీమూడును నల్పుకలిగియుండుట, నేత్రములకు పైచూపుమాత్రము కలిగియుండుట, మాటలు సన్నబడుట,

కాళ్లు చేతులు నడుము మొదలగు సన్ధులు (కీళ్లు) వదలుట, అనగా నిస్త్రాణ కలిగియుండుట, అను నీలక్షణములుగల అలసకవిషూచికారోగము కష్టసాధ్యమైనది.

## జీర్ణాహార లక్షణము.

శ్లో. ఉదారశుద్ధిరుత్సాహో వేగోత్సర్గోయథోచితః
లఘుతాక్షుత్పిపాసాచ జీర్ణాహారస్యలక్షణం ౧౦.

తా. అతిశుద్ధమును, ఉత్సాహమును, కార్యములయందు సోమరితనములేనుండుటయును, శరీరముభారములేకయును, ఆకలిదప్పులు కలుగునట్లునుచేయు ఆహారముజీర్ణాహారము. ఇట్లుచేయనిదిఅజీర్ణాహారమనబడును.

ఇది మాధవ నిదాన గ్రంథమున అజీర్ణనిధాన ప్రకరణమునందు చెప్పఁబడిన విషూచికా నిధానము.

---

## వాంతియొక్క భేదములు.

(౧) కడుపునొప్పి, నాలుకయెండుట, ఎక్కిళ్లు, సన్ని, మూర్ఛ, శీతలము ఇవిగలిగి, నేత్రములు నలుపై, భేదియు నలుపుగాగలిగి, శరీర మాద్యంతమును బంకవలె చెమటపట్టినయెడల అసాధ్యమని తెలియవలయును. ఇది ౩౦ ఘడియలలో మృతిని కలుగజేయును.

(౨) మూర్ఛ, క్రింది కడుపునొప్పి, నెత్తుటబంకపడుట, పెదవులు మూతబడుట, నరములు లాగుట, చలి కలుగుట, సంధుల బలముతగ్గుట, పసుపురంగుగా నిలువక భేదియగుట, ఇట్టి లక్షణములుగల రోగి ౩ దినములకుమీద గతించును.

(౩) అజీర్ణమునందువలె మిశ్రమముగను, తెల్లగను, అడుసువలెను భేదియగును. దీనియందు అన్నమును వచ్చును. దాహము కలుగును. చలి, గొంతులో పొడుచుట, కడుపునొప్పి, శరీరదుర్గంధము కలుగును. ఇది సామాన్యలక్షణము.

(ఆయుర్వేద సంగ్రహము.)

## వాంతిభేది ఔషధములు.

(౧) కలియబెట్టిన పెట్లుప్పు ద్రావకము ౧ డ్రాం, పెప్పర్‌మెంటు నీళ్లు, లేక కర్పూరనీళ్లు 1 ఔన్సు, అబినిభావన ద్రావకము ౩౦ బొట్లు, వీనిని చేర్చి యిందులో $\frac{1}{4}$ భాగమును తీసికొని దానినిగంజితో చేర్చి 3 లేక ౪ ఘంటలకొకతూరి యిప్పించినయెడల గుణమగును. (Mr. Hope.)

(౨) క్లోరేడ్ ఆఫ్ పొట్టాష్ 8 గ్రేనులు, నల్లఉప్పు 20 గ్రేనులు, కార్బొనెట్ ఆఫ్ సోడా 30 గ్రేనులు, వీనినిచేర్చి నీళ్లలోకలిపి యీయవలయును. ఇట్లు 2 లేక 3 ఘంటలకొకమారు ఇచ్చుచుండిన గుణమగును. (Dr. Stevens.)

(౧) సొంటి, పిప్పలి, మిరియాలు, సన్నరాష్ట్రము, లవంగము ఇవి వగకు పలము ౧ చేర్చి చూర్ణముచేసి, ఇంగిలీకము వరాయెత్తు ౧; రససిందూరము వరాయెత్తు $\frac{1}{2}$; సవ్వీరము వరాయెత్తు $\frac{1}{2}$; రసకర్పూరము వరాయెత్తు $\frac{1}{4}$; వీనినిచేర్చి తేనెపోసి లేహ్య పక్వముగా నూరి యెత్తుకొని భేది వాంతిగలవారికి ఉస్తెకాయంత ప్రమాణము చొప్పున మూడుపూటలిచ్చిన యెడల నివర్తియగును. దాహముకలిగెనేని అన్నపుకాడి (వినిగర్) యీయవలయును. ఆహారము ఉప్పుడుబియ్యపునూకలగంజిలో ఉప్పువేసి యిప్పించవలయును, శీతలము కలిగెనేని అల్లపురసము కండ్లకు కలికము వేయవలయును.

(ఆయుర్వేద సంగ్రహము.)

మద్విరచిత "వైద్యసారరత్నావళి" యందు చెప్పంబడియుండు అజీర్ణకంటకరసమును విషూచికి యుపయోగించినయెడల గుణము కలుగజేయును.

---

## వాంతి భేది.

ఈ వాంతిభేది దుర్వాయువువలన బుట్టి, వ్యాపించి, వాంతిభేదిని కలుగజేసి అతిశీఘ్రమున శీతలమును పుట్టించుచున్నది. ఉజ్జయినీ నగరము హూణులకు స్వాధీనమైనకాలమున నాయూరియందుండు కాళి మొదలగు దుష్టదేవతలు ఈదుర్వ్యాధిని కలుగజేసినట్లు హిందువులు కొందఱు చెప్పుచున్నారు. శ్యామలాదేవియొక్క కోపమువలన నీదుష్టరోగము కలుగుచున్నదని పొంగలిపెట్టి బలియిచ్చి ధూపదీప నైవేద్యములు మొదలగు ఆరాధనలను జరిపించి కోపమును శమింపజేయుట హిందూ దేశాచారము.

వాంతిభేది మనుష్యులను జంపు రోగము. ఇంగ్లీషులో దీనిని (మెలిగ్నెంట్)—(ఏష్యాటిక్)—(అల్జీయిడ్)—(కలరా) అని పలువిధములుగాం జెప్పుటకలదు. అల్జీయిడ్ అనగా ఉష్ణలోపమని పేరు. ఈదుర్వ్యాధి మన దేశమున 1817 వ సంవత్సరము మొదలు కలిగినదనియును, 1832 వ సంవత్సరమున ఇంగ్లాండు దేశమున కలిగినదనియును ఆంగ్లేయుల యభిప్రాయము. ఈవ్యాధి కలుగుటకు కారణమును, ఒక్కొక కాలమున కలిగి వ్యాపించి కొన్నియేండ్లవఱకు లేకుండుటకు కారణమును మనకింకయు విశదముకాలేదు. వారివారి మనస్సునకుతోచినట్లు చెప్పుచున్నారు. ఈరోగము ఒకవిధమైన విషవాయువని సకలమైనవారును ఒప్పుకొనుటకు హేతువు కలదు. అనుభవమువలన నీవ్యాధినిగుఱించి మనకు తెలియునది యేమనంగా,—ధనవంతులకంటెను దరిద్రులను అధికముగా అనుసరించుచున్నది. దరిద్రము, పెంట, మలము, దుర్వాయువు మొదలగువానివలన వాంతియొక్క ఉగ్రము అధికమగుచున్నది. వానిని తొలగించినయెడల వ్యాధియొక్క యుగ్రము పోవుచున్నది. చెరసాల మొదలగు జనసంఘముగల స్థలములం దీవ్యాధి ప్రవేశించి యనేకులను మృతినొందింప జేయుచున్నది.

## లక్షణములు.

ఈరోగమునందు 3 స్థితులను కనుగొనవచ్చును. (1) భేదియు వాంతి యునుండును. రక్తమునందును దేహమునందునుండు విషము బయలుపడుటకై దైవసంకల్పముగా గలుగుచున్నదని యొకరియొక్క యభిప్రాయము. (2) వాంతి భేదితోగూడ సన్ని, శరీర శీతలము, క్షీణనాడి యివి సంభవించును. (3) అంత్యమునందు బలహీనము (విలవిలబోవుట) కలుగును.

ఇందు కలుగు వాంతియును భేదియును ఒక విధమైన గంజినీళ్లవలె నుండును. కాళ్ల యందును, కడుపునందును కండకు నొప్పికలిగి బిగువగును. మూత్రము శుద్ధముగా స్రవించదు. దాహమధికముగా నుండును. నాడిగతి యును, శ్వాసగతియును తగ్గి మిక్కిలి నిస్సత్తువకలిగి, శరీరము నాలుక శ్వాసము ఇవిచల్లనగును. వ్రేళ్లుముడతలుబడును. పెదవులును, శరీరమును నీలి వర్ణమగును. కంఠధ్వని హీనమగును. ముఖమును దేహమును వాడిపోవును. శరీరోష్ణము తగ్గినను రోగికి కప్పుకొనుటయందిష్టముండదు. కన్నులు గుంటలు పడును. ఆమీద సంభవించునదేమనగా,—శ్వాసము తగ్గును. నాడియాడుట తెలియదు. తుదకురక్తవేగము నిలిచిపోవును. అందఱికిని ప్రాణముపోవువఱకు బుద్ధి స్వాధీనముగానే యుండును. రోగికి ఒక్కసమయము జీవింతుమనెడి నిశ్చయమును, ఒకసమయము జీవింపమనెడినమ్మకమును కలుగును. ఇందు సాధారణముగా 2-18 ఘంటలలోపల మరణము సంభవించును. దీనికి పైబడిన యెడల సుగుణము కలుగుటకు అవకాశముకలదు. బహుశీఘ్రమున కొందఱికి దేహముస్వస్థమగును. ఒక్కొకసమయమున కొంచెము సుగుణము కనబడినప్పటికిని మూత్రము శుద్ధముగా దిగక ఆమూత్రము రక్తముననిలిచి విషమించి రోగి యొక్క ప్రాణముతీయును. ఇందు నిద్ర, తలనొప్పి, సన్ని, వాంతి, గొంతులో కఫము, శోకము ఇవియుండును. కొందఱికి స్వల్పజ్వరముకలిగి తర్వాత శోషమునకై

శీఘ్రమున దేహముసౌఖ్యమగును. కొందఱికి జ్వరము అతిక్రమించి అధికక్షీణము కలిగినను మంచిచికిత్సవలన సౌఖ్యమునొందును. ఒకానొక సమయము మొదట భేదికనుపించి తర్వాతయీరోగము కల్గును. అయినను నిర్నిమిత్తముగా కలుగుట వాడుకయైయున్నది. మలమును పరీక్షించిచూచినయెడల నీరును, లవణములును, నల్లఉప్పును అధికముగా నుండును.

Pathology. వాంతిభేదియొక్క కారణమును చెప్పుటకు మనకొక యాధారము కలదు. అదేమనఁగా,—వాంతిభేది యొకవిధమైన విషపదార్థముచే కలుగుచున్నది. ఆవిషపదార్థముండుటకును, అతిక్రమించుటకును, శక్తికిని, దానిని ఒకచోటనుండి మఱియొక్కచోటికి పోవునట్లు చేయుటకును గాలియొక్క యొకవిధమైనస్థితియే కారణము. ఒకానొక సమయము అత్యుష్ణమును దీనితో సంబంధ ముండుట కలదు. ఈవిషముయొక్క వ్యాప్తమును సకలవిధములైన అశుద్ధములు బలపఱచుచున్నదని సందేహములేక చెప్పవచ్చును. ఈవ్యాధికి అంటుకొను స్వభావము కలదనియును, లేదనియును చెప్పుట ప్రయాసగానున్నది. అయినను మనుష్యులు దీనియొక్క వ్యాప్తమును ఒకవిధముగా నివర్తింపజేయవచ్చును. అంటురోగములు దానికితగిన శరీరములయందుమాత్రము చేరుచున్నది. బీజమునకు తగినభూమి యెట్లు ప్రసిద్ధమో, అట్లే యీరోగమనెడిబీజమునకుతగిన శరీరమును ప్రసిద్ధమైయున్నది. కాఁబట్టి యీసాంక్రామిక రోగమును బీజ తుల్యముగా జెప్పవచ్చును.

వాంతిభేది వ్యాధియొక్క విషము (Cholerine) చర్మముయొక్క మార్గముగనో, లేక శ్వాసకోశముయొక్క మార్గముగనో, లేక ప్రేగుల్లయొక్క మార్గముగనో ప్రవేశించి రక్తముతో చేరుచున్నది. లోపలికిపోయిన విధమిట్టిదని చెప్పుటకు సాధ్యముకాకున్నది. శ్వాసమార్గమున లోపలికి బోవుచున్నదని తలుచుగా నమ్మవచ్చును.

వాంతిభేది రోగము వ్యాపించునప్పుడు, దానికిలోనగుటకు కొన్ని కారణములుగలవు. (Pre-disposing Causes) అనగా,—చెడిన మత్స్యమాంసములు కాయలు పండనిపండ్లు వీనిని భక్షించుట, అశుద్ధ జలపానము, జలదారికంపు, చెడిపోయిన వస్తువులను అమ్ముట, కుప్ప మొదలగు దుర్గంధము, మధుపానము, అనాచారము, చెడ్డచలిగాలి, దేహబలమును క్షీణింపజేసి మిక్కిలి ఆయాసమును కలుగజేయుపనులు, చాలసేపుదాక భోజనము చేయకుండుట, భేది, అనునివి కలిగిన శరీరములయందు వాంతిభేదిరోగమావాహనమగును. కావున వాంతిభేది వ్యాపించు కాలములయందు మంచి గాలిగల యింటియందు కాపురముండవలయును; ఆయిల్లు మిట్టయైన స్థలముగను, ధారాళముగా గాలి వ్యాపించుటకు దగినదిగను, ఎండినచోటుగనుండవలయును. ఆరోగ్యవిధి ప్రకారము నడచుకొనవలయును. విరేచనమగుటకు దగినపదార్థములనుగాని విరేచనమునకుగాని పుచ్చుకొనగూడదు. విరేచనమునకు ఎంతమాత్రమును చోటీయక, సందేహించుటకుం దగినట్లు మలప్రవర్తియైన తత్క్షణముపరుండిన పడకయందుండియే అబిని,ఓమము,సొంటి మొదలగువానిని సేవించి దానిని ఖండించవలయును. లేనియెడల ఆవిరేచనము వాంతిభేది విషమునకు చోటిచ్చును. ఇట్లు చెప్పినను సాధారణమైన భేది వాంతిభేదిని కలుగజేయునని నమ్మకూడదు.

## చికిత్స.

విషభేది రోగమునకిచ్చి పరీక్షచేయని మందు ప్రపంచమున నేదియులేదు. ఒకరికి ప్రయోజనమైనది మరియొకరికి ప్రయోజనము కాక పోవుచున్నది. రోగారంభమునందు తగినట్టిమందును సేవించినయెడల గుణము కలుగును, కాలవిలంబమైనయెడల యేమందునకును కట్టుపడదు. భగవంతునకు ఒప్పగించవలసినదేను.

మనుష్యులను జంపునట్టి యీరోగమునకు, ఇట్టిమందే యీయవచ్చు నని నిశ్చయించి చెప్పుటకు నాకు శక్తిలేదు. కాఁబట్టి కొందఱిచ్చి గుణము కలుగఁజేసిన మందులను చెప్పఁబడును. వానిలో వైద్యులకు ఇష్టమైనదేదో దానిని వారు ఉపయోగించుకొనవచ్చును. ఒక వైద్యుఁడిచ్చుదానిని మరి యొక వైద్యుఁడు నమ్ముట ప్రయాసము.

## ఔషధములు.

వంగఉప్పు (Sugar of Lead) * 2 గ్రేనులు, రసభస్మము (Calomal) 3 గ్రేనులు, కర్పూరము 2 గ్రేనులు, అబిని 1 గ్రేను, త్రికటుక (సొంటి పిప్పలి మిరియాలు) చూర్ణము కొంచెము, వీనినంతయుచేర్చి రెండు మాత్రలుగాచేసి పెద్దవాండ్ర కీరెండును, 15 సంవత్సరముల వయస్సుగల వారికి ఒకటిని, 10 సంవత్సరముల వయస్సుగలవారికి అర్ధమాత్రను ఇయ్యవల యును. ప్రతివారికిని 2 లేక 3 ఘంటల కొకమాఱు సుగుణము కలుగువఱ కిచ్చుచుండవలయును. దీనితోఁగూడ ఓమద్రావకమును ఇచ్చుచుండవచ్చును.

(Dr. Paterson's Cholera Pills.)

మిరియాలు, ఇంగువ, అబిని, ఇవి దినుసు ఒకటికి 12 గ్రేనులువంతున చేర్చి 12 మాత్రలుచేసి ఒకమాత్రను అరగంటకు, లేక గంటకొకతూరి రోగము నిమ్మళించుదాక ఇయ్యవచ్చును. 7 మొదలు 14 సంవత్సరములలోపల వయస్సు గల బాలురకు అరమాత్రయియ్యవచ్చును.

కర్పూరము 5 గ్రేనులు, అబిని ½ గ్రేను, వీనినిచేర్చి మాత్రచేసి 1 లేక 2 ఘంటల కొకతూరి యిచ్చుచుండవలయును.

రోగారంభమునందు ఓమమును నూరిగాని, లేక ఓమద్రావకమును గాని యిచ్చినయెడల గుణమిచ్చును.

---

* గ్రేను అనునది సుమారు అరగురుగింజ ప్రమాణము.

సొంటి, మిరియాలు, పోస్తుకాయ, నాగకేసరము, అతివస, కరకాయపూవు, జటామాంసి, మానిపసుపు, వీనినిచేర్చి కషాయముపెట్టి యిచ్చిన యెడల భేదికట్టును.

క్లోరడైన్ యిచ్చుట ఇంగ్లీషు వారిపద్ధతి.

పూరణాదిలేహ్యము (మదనకామేశ్వర లేహ్యమునకంటె కొంచెము తక్కువదినుసులు చేర్చి చేయుమందు) ఇచ్చినయెడల చాలామట్టుకు గుణమిచ్చుచున్నది. అనుభవమైనది. మిక్కిలి నమ్మకముగా ఇయ్యవచ్చును.

సొంటి, లవంగము, లవంగపట్ట, జాజికాయ, ఏలకులు, మిరపకాయలు, వస, ఇవి దినుసు ఒకటికి నాలుగువరాలయెత్తు చేర్చి దంచి ఒకబుడ్డి మంచిసారాయి, లేక బ్రాందిలో వేసి జిలకొట్టి 12 ఘంటలసేపు నానినమీద దానిని యుపయోగింపవచ్చును. వ్యాధి కనుపించినతోడనే దీనిలో 2-4 ఉద్ధరిణె ప్రమాణమును కొంచెము వేడినీళ్ళలోపోసి నోటికి సహించుటకై కొంచెము చక్కెర చేర్చి పుచ్చుకొనవలయును. దీనిని పుచ్చుకొనిన ఒకఘంట సేపులో గుణము కలుగక పోయినయెడల మరలను మందు పుచ్చుకొనవలయును. రోగికంబళినికప్పుకొని నెమ్మదిగాపరుండి యుండవలయును.

## ఉపచారములు.

పైన నుదహరించిన మందులలో దేనినైన నొకటిని యిచ్చుచుండు నప్పుడు, మధ్యలో రోగికి చేయవలసిన ఉపచారము లేవియనగా,—దాహము అణగుటకు అన్నపు గంజినీళ్లు, (అనగా నూకలు మొదలగునవివేసి కాచిన గంజి, గంజిని కలిపివంచిన పైనీళ్లు, చల్లనినీళ్లు, సోడావాటర్, వీనిలో నొకదానిని ధారాళముగా నిప్పించుచుండవలయును. వాంతియగుచుండినప్పటికిని బాధకములేదు దాహమునుమాత్రము అణచరాదు. చలవ కమ్ముకొనును నను తలంపుతో నీళ్ళనే బొత్తుగా కన్నులకు చూపకుండునట్టి మనయింటి వారి వాడుకను తత్‌క్షణము తొలగించినయెడల నిస్సందేహముగా రోగులు

సౌఖ్యమొందుదురు. వేడినీళ్లుపోసి ఆవాలునూరి గుడ్డలోచరిమి గుండెకాయ పల్లముపైవేసి యుంచినయెడల వాంతినిలుచును. ఉలవపిండిలో కర్పూరము చేర్చి దానిని కాళ్ళపైవేసి ఉష్ణము పుట్టుటకు ఎడతెగక రుద్దుచుండవలయును. కర్పూరతైలము కీళ్ళకురాచుట యింగ్లీషువైద్యము. ఇసుక, బూడిద, తవుడు, వీనిలో దేనినైనను నొకటినివేచి శరీరముమీద ఒత్తడమీయవచ్చును. ఉష్ణమును కలుగును. బాధయు నిమ్మళించును.

నూకలగంజిలో అధికముగా ఉప్పుచేర్చి అప్పుడప్పుడు దాహము అణగునట్లు ఇచ్చుచుండవలయును.

అరరూట్, సేగో, గోధుమలు, వీనిగంజినియిచ్చుట డాక్టర్లయొక్క పద్ధతి.

## రోగనివారణోపదేశము.

విషూచిరోగ వ్యాపక కాలములయందు, దిగువ కనబరచు కొన్ని విధులను అనుసరించినయెడల చాలమట్టుకు రోగము మనయొద్ద చేరదు. అందును జ్ఞప్తికి దెచ్చుకొనవలసిన ముఖ్యవిషయములు:—

(1) సారాయిదినుసులను అధికముగాఅపేక్షింపక క్రమముతోనుండవలయును.

(2) శరీరసౌఖ్యమును కలుగజేయువిధులను ముఖ్యముగా ననుసరించవలయును.

(3) పథ్యమునకు ప్రయోజనమగు కాయగూరలను చేర్చుకొనవలయును. పండ్లదినుసులను మితముగా భక్షించవలయును.

(4) భేది కనుపించిన తోడనే ఆలస్యము చేయక ఔషధమును స్వీకరించి దానిని తొలగించుకొనవలయును. ఈ దుష్టవ్యాధి చాలాభాగము రాత్రిళ్లయందు గనబడుటవలన అట్టిసమయమున వైద్యులను వెదకుటకు అనుకూలముగాక, తెల్లవారువఱకు ఊరకుండి ఆమీద వైద్యులనువెదకి ఔషధ

ప్రయోగము చేయనంతలో రోగము అసాధ్యమై పోవుచున్నది. కాబట్టి ప్రతివారును ఏదైనను మందులను తమ యిండ్లయందుంచుకొన వలసినదది ఆవశ్యకము.

(5) అనుకూలమైనయెడల వాంతిభేదిగలచోటును విడిచి వేఱే చోటికిపోయియుండి, వ్యాధి నివారణమైన మీదవచ్చుటమంచిది.

(6) వాంతిభేదికనుపించిన స్థలమునకు పోకుండుట శ్రేష్ఠము,

(7) ఇంటిగోడలకు సున్నముగొట్టి, భూమికిసున్నముచల్లి కుప్పమొదలగు అశుద్ధవస్తువులను ఇంటిలోజేర్చక అప్పటి కప్పటికి తొలిగించుచు, తాము సు శుచిగానుండవలయును.

(8) విషభేదికనుపించిన రోగియొక్క వమనమును మలమును అశుద్ధ వస్త్రములను, అప్పుడప్పుడు దూరముగాతీసికొనిపోయి పాతించునట్లుచేసి, స్థలమునుశుద్ధిచేసి, సాంబ్రాణి, చందనము, సాంబ్రాణివత్తిమొదలగు సుగంధ ధూపములు వేయుటమంచిది. రోగియొక్క అశుద్ధములను చేర్చియుంచిన యెడల అవి మరిగి విషపదార్థముజనించి యింటిలోనివారినందఱిని బాధించును. ఒకయింటియందు నలుగురైదురకీవ్యాధి కలుగుటకు కారణమిదియే యని తెలియవలయును. ఒకయింటియందు 1-2-3 జనులకు ఈ వ్యాధిసోకిన యెడల తోడనే తక్కినవారు ఆచోటనుండి మఱియొకచోటికి పోయి యుండవలయును.

(9) పదార్థములయందు ఉప్పును అధికముగాచేర్చి భుజించుచుండిన యెడల వాంతిభేదిరోగము అనుసరించదని తెలిసినది. ఈరోగము వ్యాప్తముగుచుండునప్పుడు, నేపాళముమొదలగు దుష్టమైన భేదిమందులను తీసికొనరాదు. నూనె, ఉప్పు, బొగ్గులు వీనిని అమ్ముచుండు వర్తకులకు ఈవ్యాధి కలుగదని వదంతి. నిజము నెఱుంగవలయును.

మ. జగన్నాథంనాయుడు,
నేటివ్ అసిస్టెంట్ మెడికల్ కాలేజి, మద్రాస్.

ఇది ప్రథమ భాగము.

---

TREATMENT FOR CHOLERA.

# విషూచి వైద్యము.

## ద్వితీయ భాగము.

---

## అవతారిక.

అఖిల జగత్కారణ భూతుండైన భగవంతుండు ప్రాణరక్షణార్థమై ఆయుర్వేదము నుపదేశించెను. అది హేతువు, లింగము, చికిత్స అని మూడు ప్రకరణములుగలదై యుండును. కాబట్టి ప్రతివైద్య గ్రంథమును ఇట్టివిభాగములతో గూడియుండునుగాన నీవిషూచివైద్య గ్రంథమును నా ప్రకారమే చెప్పఁబడును.

## విషూచిరోగపర్యాయనామములు.

(1) భేది వాంతి మొదలగు నుపద్రవములను కలుగజేసి త్రిదోషాధిక్యముతోగూడి శరీరమంతయు సూచి (సూది) తో పొడిచినట్లుండుటం జేసి దీనికి "విషూచి"యని పేరుకల్గెను. (జీవరక్షామృతము.)

(2) అనేక యుపద్రవములు కలుగజేసి వాతాధిక్యమై సూదితో పొడిచినట్లుండుటచే "విషూచి" యనబడెను. (మాధవనిదానము.)

(3) విషమునుపూసిన మొనలతోగూడిన సూదితోపొడుచునట్లు పొడుచుటచేత "విషూచి" యని పేరుకలిగెను. (జ్ఞానవాసిష్ఠము.)

(4) జీవరక్షామృతమునందు చెప్పఁబడిన గుణములతోగూడియుండుటయేగాక యింకయు ననేక యుపద్రవములకు సూచకమై యుండుట చేతే "విషూచి" యనబడెను. (బాహటము.)

(5) వ్యాధిప్రవేశించిన స్థలమునందుండు ప్రాణులనందఱిని నిర్మూలము చేయుటచే దీనికి "ప్రళయరోగ" మని పేరుగలిగెను. (అగస్త్యవైద్యము.)

(6) పిత్తాధిక్యముచేత అజీర్ణము ననుసరించి వచ్చుటచేత "కలరా" యని చెప్పఁబడెను. (ఆంగ్లేయవైద్యశాస్త్రము.)

(7) భుజించినయన్నము విషమించుటచేత "విషభేది" యని చెప్పఁబడును. (ఇతరగ్రంథములు.)

(8) లోకమునందు చూడగానే భ్రమనుకలుగజేయునదియై యుండుటచే "భ్రాంతి" యనంబడెను. (ఇతరగ్రంథములు.)

(8) ఈవ్యాధిని నోటితోడ చెప్పుటకు భయముగానుండుటంబట్టి "చేదు" అని చెప్పబడెను. (వృద్ధజనవాక్యము.)

(10) ఈవ్యాధి యొకవిధమైన విషముచే కలుగుచున్నదిగానే "విషభేది" యని చెప్పబడెను. (మహాజనవాక్యము.)

## హేతువిభాగము.

వాంతిభేదిరోగము పూర్వకర్మమననుసరించి యనేకకారణములచేత జనులకు సంభవించును.

ఆకారణములు ఆత్మిక, భౌతిక, దైవికములను భేదములుగలవైయుండును.

ఆత్మికము:—ఆహారమును జీర్ణమునకుం దగినట్లు భుజింపక, తక్కువగను ఎక్కువగను భుజించుట; తన ఇష్టానుసారమైన పదార్థములను వేళా విచారములేక స్వీకరించుట; గంజిచుట్టుకొన్నదియు, చిమిడిముద్దయైనదియు, వెంట్రుకలు, పురుగులు, ఉమక మొదలగువానితో గూడినదియు, ఎండిపోయినదియు, మాడిపోయినదియు, చక్కగా ఉడకనిదియు, నీళ్లువిడిచి నాలుపాచినదియునగు అన్నమును భుజించుట; వాడుకలేని యితరదేశ

పదార్థములను భుజించుట; మురిగినదియు వండి చెడిపోయినదియునగు మత్స్య మాంసములను భక్షించుట; వ్యాధిగలిగిన మృగమాంసములు, పసలేని యెండిన పక్షిమాంసములు, మద్యపానము, ఉడికి ఉడక్కని కాయగూరలు, పదును తప్పిన పదార్థములు, తామ్రమాదిలోహపాత్రలయందు వండినయన్నము మొదలగువానిని భక్షించుట; మామిడి, పనస, అరటి, నేరేడు, సీతాఫలము మొదలగుఫలములు, వేఱుసెనగలు, కొండకందులు, కాయపెసలు, పెసలు మొదలగు కాయధాన్యములను అధికముగా భక్షించుట; అన్నము, పాలు, పెరుగు, నెయ్యి అనునివి ప్రమాణమునకును వాడుకకును అధికముగను ప్రత్యేకప్రత్యేకముగను స్వీకరించుట; మాటిమాటికి నీళ్లు త్రాగుట; జీర్ణకాలములందును, సంయోగకాలములయందును మిట్టపల్లముగలచోట్లయందు పరుండుట రాత్రియందు మేల్కొనుట; పగటియందు నిదురించుట; జనసంఘమునందు సంచరించుట; అధికముగా నడుచుట; అశుద్ధస్థలమున వసించుట; అశుద్ధజలమును స్నానపానములకుపయోగించుట; మలమూత్రములను బంధించుట అనునివి మొదలగునవి. మఱియు పైజెప్పినవానివలన భయశోకక్రోధాదులును కలుగును.

భౌతికము:—అధికముగావానకురియుట, అధికముగా ఎండకాయుట, అధికముగా విషగాలివీచుట మొదలగునవి.

దైవికము:—ఆత్మిక భౌతికములకు వేఱైనది. అది దైవసంకల్పముగా నుండును.

పైజెప్పిన హేతువులకు కార్యమును, వాంతిభేదిరోగమునకు కారణమును అలసకరోగమై యున్నది.

## అలసకరోగోత్పత్తి.

ప్రమాణమునకధికమైన ఆహారము విషమించి సకలదోషములను శీఘ్రముగ కలుగజేయును. ప్రమాణమునకు తక్కువైన యాహారము శరీరమునకు బలమును, రూపమును తగ్గుటయేగాక వాతాధిక్యమును కలుగజేయును.

అపక్వాన్న స్వీకరణము వాతపిత్తశ్లేష్మములను వ్యత్యస్తమగునట్లు చేయును.

ఈ మూడిటిలో అపక్వాన్నమును మాటిమాటికి భుజించు అశనఘాతకునకును, మలము మూత్రము అపానవాయువు తుమ్ము ఆవులింత ఆకలి దాహము దగ్గు నిద్ర కన్నీరు శుక్లము శ్వాసము వాంతి బడలిక అనువీనిని అణచువానికిని, మందాగ్నిగలవానికిని, అలసకమనెడు మందరోగము కలుగును. మరియు అశనఘాతకునకు ఆమాశయ (జీర్ణకోశ) స్థానమునందు ఆ యన్నము అధికరించుటచేత త్రిదోషములు ఆ యన్నముతో చేరుకొని దానివలన నాయశనఘాతకునకు (తిండిపోతునకు) ఆయన్నముపిత్తమునుమట్టు పరచి శ్లేష్మముచే ఆడ్డగింపంబడి ఆ కోట బిరడవేసినట్లుండి వాంతియు భేదియు కాక స్తంభించి, ఆ యుపద్రవముతో గూడ శూలాది యుపద్రవములను కలుగజేయును. దీనిని అలసకమనెడు మందరోగమని చెప్పుదురు.

## అలసకలక్షణము.

కడుపుఉబ్బుట, వాడుట, కూయుట, వాయువు బంధించి హృదయమునందును కంఠమునందును సంచరించుట, వాయువుచే మలబంధమధికముగ నుండుట, దాహము, తేనుపులు అధికరించుట, అను నీలక్షణములతోగూడినది అలసకరోగము. (ఆయుర్వేదము.)

అలసకరోగము సంభవించుటకు హేతువైనట్టి స్తంభించిన యన్నమును వాతపిత్తములు శీఘ్రమున నోటితోనైనను అపానముతోనైనను బయలుపడునట్లుచేయుట వాంతిభేదిరోగ మనబడును.

## వాంతిభేదిరోగోత్పత్తి.

అలసకరోగమును కలుగజేసి దానిని అణగిచుకొనియుండిన ఆమదోషమధికరించి బహిర్గతమగుటచేతను దానికి ఉపబలముగా ఎండ అధిక

మగుటచేతను వాంతిభేదికలుగును. ఇది శీతాంగ సన్నిపాతరోగముతో సమాన మైనది. కావున ఆలస్యములేక వైద్యముచేయవలయును.

మతాంతరము

(1) ఏకవిధమైన విషమువలన వాంతిభేదిరోగము కలుగుచున్న దనియును;

(2) ఆవిషము శరీరములో వ్యాపించి అదిరక్తముతోజేరక వేగు యొక్క మజ్జతోచేరుటవలన వాంతిభేది కలుగుచున్నదనియును;

(3) ఆవిషము కుడిపార్శ్వమునందలి రక్తాశయము (Heart) నందుండు చెడ్డనెత్తుటిని శుద్ధిచేయునిమిత్తము పుపుసము (Lungs) నందుచేరి పుపుసధమనిని (Pulmonary Artery) ముడుచుకొనునట్లుచేసి కుడిప్రక్క నుండి యెడమప్రక్కకు రక్తమును పోనీయక చేయుటవలన వాంతిభేదికలుగు చున్నదనియును;

(4) ఆవిషము మేదస్సునందు వ్యాపించి వాంతిభేదిని కలుగజేయు చున్నదనియును చెప్పెదరు.

(5) రక్తమునందు క్రిములుజనించకగాని వాంతిభేదిరోగము కలుగదని ఆంగ్లేయులు చెప్పుచున్నారు.

(6) శ్యామలాదేవియొక్క ప్రేరణచేత స్థూలేంద్రియములకు గోచరము గాని నీలవర్ణమైన ప్రళయవాయువు భూమిమీఁదులను యోగీశులనుతప్ప తక్కిన వారియొక్క కపాలమార్గముగా ప్రవేశించి రక్తవాహిని (Arteries) యందు చేరి రక్తమును చెడుపుటచేత వాంతిభేదికలుగుచున్నదని అగస్త్యులు చెప్పు చున్నారు.

(7) కర్కటియనురక్కసి తనయొక్క దీపాగ్నిపూర్తిగా నివర్తించు చుటకై బ్రహ్మదేవునివరము వలన రాజులు యోగులుగాక తక్కిన వారియొక్క

రోమకూపములయందు సూచీరూపమై విషయుక్తస్వల్పజీవము ప్రవేశించిరక్తమాంసములను గ్రహించుటచేత వాంతిభేది కలుగుచున్నదని వస్తిస్టులు చెప్పుచున్నారు.

(8) అంతర్మల క్రిములుజనించినయెడల వాంతిభేదిరోగము కలుగునని యాంగ్లేయవైద్యులలో కొందఱును, హిందూవైద్యులలో కొందఱును చెప్పుచున్నారు.

## పామరజనాభిప్రాయము.

వాంతిభేదిరోగమును దండుమారియమ్మయనియు దీనికి కలశము పెట్టి అమ్మవారిని ఆవాహనముచేసి మారికాగణములుగలవారు హాహా హూహూ యని కూయుచు ఆడుచు పాడుచు బలులిచ్చిన నివర్తియగుననియు తలంచి యాప్రకారముగావించెదరు. ఇదియు యుక్తమేను. భగవంతుఁడు భగవద్గీతలలో చెప్పినచొప్పున నెవరెవరెట్లెట్లు కీర్తించెదరో వారివారికట్లట్లును గ్రహించెదనని చెప్పియున్నాడు. కావున పామరులయొక్క హృదయానుగుణ్యమైన యీకార్యమునుజూచి పారమార్థికులు తిరస్కరించుటతగదు. మనోధైర్యమున కిదియొక కారణమైయున్నదిగాన నీకార్యము సర్వజనులకును శ్రేయస్కరమైనది. ఇంతేగాక మనదేశములో శీతభేదిని శీతలాదేవి యనియును, అగ్నిమసూరికారోగమును అగ్నిమారియమ్మ యనియును, విద్రధిరోగమునుసారకాయ అమ్మవారనియును, జ్వరరోగమును గంగమ్మయనియును, స్ఫోటకరోగమును పెద్దమ్మవారనియును, ఇట్లుదుష్టవ్యాధులనంతయు మారియనివ్యవహరించి పూజోపచారములచే శమించుననియెంచి యట్లుకావించుట యాచారమైయున్నది.

## లింగవిభాగము.

వాంతిభేదిరోగము పూర్వము, మధ్యము, అంతము అని మూడువిధములరూపములై యుండును. ఇందు పూర్వరూపము వ్యాధియొక్క ఆరంభలక్షణమును, మధ్యరూపము వ్యాధియొక్క ఉగ్రలక్షణమును, అంత్యరూపము వ్యాధియొక్క అసాధ్యలక్షణమును దెల్పును.

## పూర్వరూపము

కడుపులో మోత, చెలువుయొక్క తూమును తెఱచినట్లు మాటిమాటికి శుద్ధజలమువలె భేది, అదేరీతిగా వాంతి, త్రిదోషములు సప్తధాతువులను వికారము చేయుటచేత రక్తము చెడుట, కండకరుగుట, జలమునుగ్రహించియుండు నరములను పిత్తవాతము లెండింపజేయుటవలన గొంతెండుట, అధికదాహము, జిగటయైనచెమట, మంట, శ్లేష్మాధిక్యముచేత సర్వాంగమును అరటిదంటువలె చల్లగానుండునట్టి శీతలము, వణకు, కన్నులుగుంటలుపడుట కన్నులకును చెవులకొనలకును మధ్యనుండుచర్మము ముడతలుపడుట, శరీరవర్ణము భేదపడుట, కంఠధ్వనిసన్నమగుట, కీళ్లయందుండు మజ్జకరిగిపోవుటవలన శరీరమాద్యంతమును కట్టువిడిచిపోయినట్లును సూదితో పొడిచినట్లును వేదనగలుగుట, పడకయీయాయకుండుట,(పొర్లాడుట) మూర్ఛ, మైకము, శీతముండుచోలు చెడిపోవుటవలన కడుపునొప్పి, అనువీనిని వాంతిభేదిరోగము తనయొక్క పూర్వార్జితముగా గలిగియున్నది. ఈ గుణములు సకలమైన వాంతిభేదిరోగములయందును గలుగును. (జీవరక్షామృతము.)

## మధ్యరూపము.

ఈ వాంతిభేదిరోగము వాత, పిత్త, శ్లేష్మములను మూడు విధములు గలదిగానుండును.

## వాతవాంతిభేదిరోగలక్షణము.

కడుపునొప్పి, భేది, భ్రమ, వణకు, శరీరము బిగుసగుట, సూదితో పొడిచినట్లు పోడుచుట, అను నీ గుణములను కలుగజేయును.

(జీవరక్షామృతము.)

వాతనాడి యధికరించుటచే కడుపులో మ్రోత, కడుపునొప్పి, దేహమునలుపగుట, కన్నులుమిడిగుడ్లుపడుట, మనోచంచలము, జ్వరము, ప్రేగులు పొర్లగించుచుండుట, అనునీ గుణములు కలిగియుండును. (చింతామణి.)

కడుపునొప్పి, భ్రమ, వణకు, కదలకపడియుండుట, అనునీ గుణములు కలిగియుండును. (బసవరాజీయము.)

## పిత్తవాంతిభేదిరోగలక్షణము.

జ్వరము, భేది, లోపలమంట, దాహము, కాళ్లుచేతులు బిగుసగుట, సూదితో పొడిచినట్లు పోడుచుట, అనునీమొదలగు గుణములుకలిగియుండును. (జీవరక్షామృతము.)

పిత్తనాడిపగలంతయు అధికరించుటచే శరీరమువాడుట, మూర్ఛ, ఎక్కిళ్లు, మాటలుతడబడుట, ప్రలాపించుట, వాంతి, మైకము, పొరలాడుట, అనునీగుణములు కలిగియుండును. (చింతామణి.)

జ్వరము, అతిసారము, ఆయాసము, దాహము, ప్రలాపము అనునీ గుణములు కలిగియుండును. (బసవరాజీయము.)

## శ్లేష్మవాంతిభేదిరోగలక్షణము.

వాంతి, ఉత్తనీళ్లవలెభేది, దేహభారము, దవడలసందులు కిక్కిరించుకొని యుండుట, చొంగకారుట, సూదితోపొడిచినట్లు పోడుచుట, అనునీ మొదలగు గుణములుకలిగియుండును. (జీవరక్షామృతము.)

చేతియందు నాడులు అడగియుండుటవలన వేదన, నడకతప్పుట, పొర లాడుట, ఊర్ధ్వదృష్టి, శరీరము తెలుపగుట, అనునీగుణములుకలిగియుండును.
(చింతామణి.)

వాంతి, శరీరభారము, మాటలుతడబడుట, జొల్లుకారుట, అనునీగుణములు గలిగియుండును. (బసవరాజీయము.)

## అవ్యవహితవిధానము.

వైద్యశాస్త్ర గ్రంథములయందు చెప్పంబడనివియును, లేక మనకు ఆగ్రంథములు కనఁబడక పోయినవియునునగు సంసర్గములైనవాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, వాతపిత్తకఫములతోగూడినవాంతిభేదిరోగములనువైద్యుడు ఊహించి తెలిసికొనందగినది. ఒకానొకసమయముపైన జెప్పంబడిన వ్యాధులు కాలదేశవర్తమానముల ననుసరించి అప్పుడప్పుడుకలిగినను కలుగ వచ్చును.

## అంత్యరూపము.

## వాంతిభేదిరోగోపద్రవలక్షణము.

నిద్రపట్టకుండుట, దేనిమీదను ఇచ్ఛలేకుండుట, వణకు, మూత్రబంధము, ప్రజ్ఞలేకుండుట, అనునీగుణములు అసాధ్యము. (బసవరాజీయము.)

## అసాధ్యవాంతిభేదిరోగలక్షణము.

శూల, అధికముగాభేది, వాంతి, కడుపుఉబ్బరము, దాహము, తాపము, అను నీగుణములుమరణమును కలుగజేయును. (ఆయుర్వేదము.)

నాలుక పండ్లు గోళ్లు పెదవులు ఇవి నలుపగుట, చూపుతప్పుట, వణుకు, చెవులువినకుండుట, జ్ఞాపకములేకుండుట, అవయవములు సోలిపడియుండుట, అను నీగుణములు మృతినికలుగజేయును. (మాధవనిధానము.)

## అసాధ్యఅలసక, వాంతిభేదిరోగలక్షణములు.

పండ్లు పెదవులు గోళ్లు ఇవి నలుపగుట, కొంచెము తెలివి, వాంతి, కన్నులు గుంటలుపడుట, హీనస్వరము, కీళ్లు వదలుట, అను నీగుణములుగల అలసకరోగమును, వాంతిభేదిరోగమును మరణమును కలుగజేయును. ఒకా నొక సమయము జీవింపజేసినను జేయును.

## వైద్యజనాభిప్రాయము.

వైద్యులుకొందఱు ఒకమాఱు భేదియు వాంతియు అయినతోడనే మనుష్యుడు హీనస్వరముతోఁగూడినయెడల అసాధ్యమని చెప్పుదురు. మరియు భేదినిగాని, లేక వాంతినిగాని గుడ్డలోతడిపి వెలిగించినయెడల అది వెలిగిన యెడల అదియు అసాధ్యమనియే చెప్పుదురు.

## గ్రంథాంతరము.

వైద్యగ్రంథములు కొన్నింటియందు వాంతిభేదిని విషూచిజ్వరరోగ మని చెప్పబడియున్నది. దానిలక్షణము లేవియనఁగా,—

వాంతి, నాడిమందముగా నడుచుట, లోపలమంట, పైనశీతలము, అతిసారము, జ్వరము, దాహము, ప్రలాపము, భ్రమ, అను నీగుణములు గలిగియుండును.

ఈ జ్వరముగలవారు నాలుగు రోజులలో మరణము నొందుదురని కాలజ్ఞాని చెప్పెను.

## చికిత్సావిభాగము.

చికిత్సలష్టవిధములు గలవైయున్నవి. అతిసారాదివ్యాధులకు కాయ చికిత్స చేయవలయునని శాస్త్రవిహితమై యున్నదిగాన దీనికి కాయచికిత్సయే చేయవలయును.

వాంతిభేదిరోగమే అధికరించిన యెడల పాదాది శిరఃపర్యంతము మంచి తైలములచేత లేపనముచేయుటయేగాక శాస్త్రరీతిగా ఉపచారమును చేయవలయును. (బసవరాజీయము.)

వాంతిభేదిరోగము అధికరించినకాలమునందు పెరుగుమీదితేట, పెరుగు, మజ్జిగ అనువీనిలో దేనినైన నొకటిని మాటిమాటికి యిచ్చుచుండిన యెడల రోగము నివర్తియగును. (మాధవనిధానము.)

వాంతిభేదిరోగము కనుపించినతోడనే సైంధలవణముతోగూడ గలిజేరు రసముగాని, చింతాకురసముగాని చేర్చి నస్యముచేసినను; సొంటి పిప్పలి మిరియాలను సైంధలవణ జలముతోనూరి నస్యముచేసినను; చీలమండదగ్గర కాల్చినను; సొంటి పిప్పలి మిరియాలనునూరి వేడినీళ్లలో కలిపి త్రాగనిచ్చినను; సొంటి పిప్పలి మిరియాలు, కానుగపప్పు, పసుపు, వీనిని సమముగా చేర్చి మాదీఫలము రసముతోనూరి అంజనముచేసినను వాంతిభేదిరోగము నివర్తియగును. (బసవరాజీయము.)

ఆరంభమునందే ఒకరింతతోడగానివాంతితోడగాని రోగముఆరంభించెనేని, నూరిన ఆవాలను ఒక గచ్చకాయంత ముద్దనుకొంచెము చన్నీళ్లలో కలిపి పుచ్చుకొనవలయును. అది వాంతిలోవచ్చినయెడల మరల మరల వాంతి నిలుచునంతదాక సేవించుచుండవలయును. ఆవాల్ననూరి గుడ్డలో తడిపి గొంతు పల్లముమీద మంటయెత్తువఱకు వేసియుంచినయెడల వాంతి నిలుచును. ఆవాలను ఆరంభమునందే సేవించినయెడల రోగముయొక్క బలమును క్షీణింపజేయును. ఒకానొకసమయము భేదినికూడా నిలుపును. వాంతి నిలిచినమీద అరరూట్ గంజినిగాని, చక్కగా జిలకొట్టిపడియగట్టిన నూకలగంజినిగాని ఉప్పువేసి (కోడిచారుతోచకొందఱిత్తురు) కొంచెము

కొంచెముగా ఇచ్చుచుండవలయును. దాహమెత్తునప్పుడెల్లను చన్నీళ్లనిచ్చుటయే ముఖ్యపరిహారము.

కాళ్లుచేతులు చల్లనై దేహమును చల్లనగుటకు ఆరంభమాయెనేని పొడిచేసిన కర్పూరమును ఆవాలును కాళ్లకురాచి ఇసుకనువేచి ఒత్తడమీయవలయును. రోగికి చెమటపుట్టించునిమిత్తము కంబళితో కప్పి అన్నపానములను ఇచ్చునప్పుడు తలనుపైకెత్తక పడకతో నుండనిచ్చి గరిటెతో లోపలికిచ్చుచుండవలయును.

కర్పూరము, ఉలవపిండి, పసుపుపొడుము వీనిచేర్చి కాళ్ళయందు రుద్దుచుండెన యెడల ఉష్ణమును కలుగచేసి శీతలమును పోగొట్టును.

లవంగము, లవంగపట్ట, జాజికాయ, సొంటి, తెల్లమిరియాలు, ఇది దినుసుకు నాలుగు వరాలయెత్తును చక్కగా పొడిచేసి ఒకబుడ్డి బ్రాందిలోగాని, కారమైన సారాయిలోగానిచేర్చి ఒక గడియసేపుదాక కుదిలించి ముప్పదిగడియలదాక అట్లేయుంచి ఆతర్వాత తేరినసారాయిలో రెండుమిల్లిగరిటెలుతీసి దానిని గుక్కెడునీళ్లలో కలిపి యీయవలయును. రెండు గడియలలోపల గుణము కలుగకపోయినయెడల మరలను ఇప్పించవలయును. ఇట్లు రెండుపూటలిచ్చినయెడల గుణమగును.

పైనచెప్పినమందులు సిద్ధముగా లేనప్పుడును అజీర్ణభేదిగానుండునప్పుడును, ఓమము, ఆవాలు, జీలకర, మిరియాలు, ఇవి దినుసుకు, ౧ వరాయెత్తుచొప్పున తీసికొనివేచి అది చిట్లునప్పుడు సోలెడు నీళ్లుపోసి ఒక పొంగువచ్చినమీద వడియగట్టి రెండుగడియల కొకగుక్కెడు ప్రకారము ఇప్పించవలయును. మలమునుమూత్రమునుబంధించికడుపుబ్బి నొప్పికనబడినయెడల జీలకర మిరియాలు ఈ రెండును దినుసుకు ౧ వరాయెత్తు తీసికొని

వేచి చిట్లునప్పుడు సోలెడునీళ్లుపోసికాచి మరిగినతర్వాత వడియకట్టి రెండు ఘడియలు కొకతూరి ఒకగుక్కెడువంతున యిచ్చినయెడల గుణమగును.

డాక్టర్ పళనియాండి.

వాయువిళంగము, సొంటి, పిప్పళ్లు కరకాయబెరడు, చిత్రమూలము వేరుపట్ట, తాండ్రికాయబెరడు, వస, తిప్పతీగవేరు, జీడిగింజబెరడు, నాభి, వీనిని సమముగా కల్వమునందుంచి గోమూత్రముతో వెన్నవలెనూరి గురిగింజ ప్రమాణము మాత్రలుచేసి యెండించియుంచుకొని అజీర్ణమునకొకటిని,వాంతి భేదికి రెండును, పామువిషమునకు మూడును, సన్నిపాతరోగమునకు నాలుగును అల్లపురసాన యిచ్చినయెడల నివర్తించును. దీనిపేరు సంజీవిగుళికలు.

(బసవరాజీయము.)

ఒకపలమువసను బూడిదచేసికొని,అయిదుపలముల మిరపకాయలను, రెండున్నరపలము పచ్చిబియ్యమునీ రెండునుచక్కగా మాడ్చుకొని ఈమూటిని నాలుగుపళ్ల కాడి (పుల్ల) నీళ్లుపోసి అరపడిగాకాచి దించుకొని దీనిని రెండుఘంటలకొకతూరి అరసోలెడువంతున ఇచ్చుచుండిన గుణమగును.

వేంకటకృష్ణశాస్త్రి.

విషూచిజ్వరచికిత్స.

పెద్దమానిపట్టరసము, పెరుగు, కాచువీనినిగాని;చింత వేరుపట్టరసము, పెరుగు, కాచు, వీనినిగాని; మామిడివేరుపట్టరసము, పెరుగు, కాచు, వీనిని గాని చేర్చి పుచ్చుకొన్నయెడల నివర్తించును. (బసవరాజీయము.)

చింతాకుపసరును మంచినూనెతో చేర్చిగాని; లేక ప్రత్యేకముగాగాని శిరస్సు, నాభి, అరికాళ్లు, వీనియందు లేపనముచేసినను, లేక పుచ్చుకొనినను నివర్తించును.

## పథ్యము.

వాంతిభేది రోగముగలవారికి గంజియేమంచిది. పుల్లని నీళ్లుచేర్చి కాచిన నూకలగంజియు, అరరూట్ గంజియు, పునర్పాకమైన గంజియు అనుకూలమైనవి. రోగము నిమ్మళించి రుచికోరువారికి పైనజెప్పిన యేదైన నొక గంజితోడ నిమ్మ నారదబ్బ మొదలగు ఊరుగాయలును, పుదీనా,కొత్త మల్లివిత్తులు, బొక్కెనకాయలు మొదలగువానియూరుబిండ్లును నంచుకొనుట కిప్పించవచ్చును. ఇట్లు ఒకటిరెండుదినములు పోయినతర్వాత పునర్పాకపు గంజితో అరటిపిందెలు, మామిడిగింజలు మొదలగువానిచే జేయబడినపులుసులను పైనజెప్పిన ఊరుగాయలను, ఊరుబిండ్లను ఉపయోగించు కొనవచ్చును. మరియు తెల్లమేకపిల్లమాంసముచారును ఉపయోగించుకొనవచ్చును.అజీర్ణము కలుగక ఉపచరింపవలయును.

గంగాధరదేవర.

ప్రస్తుతమున ‘బార్లి’ అను బియ్యపుగంజినిచ్చుచు సౌఖ్యమును కలిగించుచున్నారు.

## వాంతిభేది చూర్ణము.

భూమిలోపలనుండు కట్టెలబొగ్గు (అనగా చాలదినములు = సుమారు పదియిరువదేండ్లు భూమిలోపల నుండినట్టిది) సంపాదించి బాగుగా చూర్ణము చేసికొని ఘడియకొకమారిచ్చుచుండిన యెడల గుణమిచ్చును.

సర్వీరమైనమును వాంతిభేదికిచ్చి గుణమై యున్నది. ఈమందునుఅనేకులు వాడియనుభవమునకు వచ్చియున్నది. దీనినిచేయుపద్ధతి “వైద్య సారరత్నావళి” యందు గనందగును.

వర్ణవైద్యశాస్త్రము (Chromopathy)లో చెప్పంబడి యుండునట్లు చికిత్స చేసినను అనుకూలమగును. ఈశాస్త్రముసకలమైనభాషలలోను దొరకుట చేతను దీనినివిస్తరించి వ్రాయవలసినదిగా నుండకుటచేతను నిచ్చట వ్రాయలేదు.

---

# CHOLERA.

*In Cholera*, the natives of India often prescribe an infusion of recently-roasted Black Pepper. Dr. Ainslie states that he has known it put a stop to the vomiting, when many other remedies had failed.

*In Cholera*, the Spirit of Turpentine applied by means of hot flannels, and by diligent friction over the abdomen, is one of the best external applications which can be resorted to. It may also be administered in the form of enema; thus employed, it has proved in many instances highly serviceable, stimulating the system, allaying the vomiting, and causing a degree of reaction which other remedies fail to produce. I would also strongly advise its internal exhibition, in the manner and doses advised in Hæmorrhage. In the stage of collapse, its external application should never be neglected.

*In Cholera*, the employment of cold water was first proposed and carried into practice by Dr. Shute of Gloucester; and from his experience, as well as from that of others, it appears, certain that the free internal use of cold water is productive of the most beneficial effects and that when it is withheld, the rate of mortality has been much higher than when it has been allowed. On referring to Mr. Ross's table (sect. 1336), it will be seen, that wherever cold water formed part of the treatment, the ratio of deaths was very much lower than when stimulants, or in fact any other remedy, had been employed. Dr. Shute states that, under this system, the state of collapse is sometimes prolonged to two, three, or four days; and others have remarked that during the reaction, a paroxysm of raging delirium is apt to take place. It is not, therefore, an inoperative system. The cold water is supposed to act, by supplying to the blood the water it looses by the intestinal evacuations by taking up the urea determining to the kidneys, and relieving the blood of the presence of this poisonous agent. When water is given, it should be as cold as is procurable, iced if possible; it should be taken in large and repeated draughts, and although for the first four or five times it may be rejected, its use should be preserved in. It soon remains on the stomach and when this is effected, a benefical change in the state of the patient is soon observable. The intense thirst which usually accompanies Cholera would alone justify the adoption of this

treatment. Whatever other treatment is adopted, cold water in copious draughts will prove a valuable auxiliary, perfectly safe, agreeable to the patient, and likely to be productive of the best effects.

EDWARD JOHN WARING,
Member of the Royal College of Surgeons in London.

---

## READY REMEDIES
### FOR
## COMMON COMPLAINTS.

CHOLERA.—The first and common form of this disease depends on an excessive secretion of vitiated bile, which gives rise to violent bilious vomiting and purging, often attended with considerable griping pain and cramp in the limbs.—*First Remedy* (Sir James Clark). Tincture of opium, tincture of camphor, and spirits of turpentine, of each three drachms; oil of peppermint thirty drops mix. Dose, one teaspoonful in brandy and water, for the mild form of cholera; and one tablespoonful for the more virulent. This proved one of the most effective and popular remedies during the terrible visitation of this disease in the year 1849.—*Second Remedy* (Board of Health). Chalk mixture, one ounce; aromatic confection, ten to fifteen grains; tincture of opium, five to fifteen drops. To be taken every three or four hours until looseness ceases.—*Third Remedy* (Liverpool Preventive). Bicarbonate of soda, one scruple; ginger, eight grains; in a glass of water after breakfast and supper.—*Fourth Remedy*. Bicarbonate of soda, twelve grains; common salt and chlorate of potash, of each six grains; mix, and take in cold water.—*Fifth Remedy*. Acetate of lead, twenty grains; opium, twelve grains; in twelve pills, one every half-hour until looseness ceases.

A CERTAIN REMEDY FOR CHOLERA.

Calomel, two grains; cayenne, three grains; to be taken every half hour, followed by a glass of brandy, until the diarrhoea is stopped.

If this remedy be taken immediately when the premonitory diarrhoea appears, it is infallible. It has been successful in hundreds of bad cases.

S. SOMASUNDRA MUDALIAR.

---